స్వామి వివేకానందుల మహోన్నత ప్రసంగాల, రచనలనుండి ప్రత్యేకంగా సంకలనం చేసిన సందేశాత్మక ప్రబోధాల ఈ సమాహారం యువతీయువకుల మానసిక వికాసానికి దోహదం చేస్తూ వారిలో ఆత్మవిశ్వాసాన్ని పాదుగొల్పి, జీవితంలో ఎదురయ్యే సమస్యలకు పరిష్కార మార్గాలను చూపిస్తుంది. అంతేగాక వారిలో ప్రేమను, సానుభూతిని, సేవానిరతి కల్పించి వారు ఆదర్శనీయ జీవితాన్ని గడపడానికి స్ఫూర్తినిస్తూ, జీవిత ఒడుదుడుకులలో చక్కని మార్గదర్శకత్వం వహిస్తాయి. ఫ్రాన్స్ దేశీయుడైన నోబెల్ బహుమతి గ్రహీత, గొప్ప పండితుడు రోమారోలా, స్వామి వివేకానందుల గురించి ఇలా స్పందించారు: "ఆయన ఉద్బోధనలు పఠించినప్పుడు నా శరీరం విద్యుదాఘాతానికి గురి అవుతుంది."



13113



Vijayaniki Margam

Subsidised Price ₹ 3/-

# విజయానికి మార్గం



# విజయానికి మార్గం

స్వామి వివేకానంద

150వ జయంత్యుత్సవ ప్రచురణ



రామకృష్ణ మఠం
దోమలగూడ, హైదరాబాదు-500 029

Published by
Adhyaksha
Ramakrishna Math
Domalguda, Hyderabad - 29

This book is published with financial assistance
from
The Department of Culture, Govt.of Andhra Pradesh

No of copies Printed :1Lack(Sept 2013)

IV - 100M - 09 - 2013
13113

Printed in India at
R P Graphics
Hyderabad



## మనవి

ప్రస్తుత సామాజిక పరిస్థితులను గమనిస్తే ఒకపక్క పుష్కలమైన సంపద, విలాసవంతమైన జీవితం, సుఖాన్వేషణ, వీటిని పొంది అట్టహాసాల ప్రదర్శన చేస్తూ పోటిపడి జీవించడమైతే; మరొకపక్క కడుపేదరికం - తిండికి, గుడ్డకు, నీడకు కరువు; వీటికై జీవిత పోరాటం; ఈ విధమైన సంకట పరిస్థితులతో సమ్మిళితమై కనిపిస్తున్న సమాజ పరిస్థితి యువతను అయోమయంలో ముంచుతోంది. ఇంతటితో ఆగక దిగజారిన భౌతిక విలువలు, వ్యాపార దృష్టితో నైతిక విలు వలను రూపుమాపిన ప్రచార మాధ్యమాలు - ముఖ్యంగా ఇంటర్‌నెట్, టీవి, వార్తా పత్రికలు ప్రచారం చేస్తున్న అసభ్య, అశ్లీల ఆవేశపూరిత విషయ సమాచారాలు - ఇవన్నీ కలిసి విలువగట్టలేని మన ఆధ్యాత్మిక సంపదను ఔన్నత్యాన్ని మంటగలిపి మన ఋషులు మనకందించిన శాశ్వత సత్యాలను, విలువలను కూకటివేళ్ళతో కుదిపివేస్తున్నాయి. వీటి ప్రభావంలో ఉన్న

యువత, పోటీ జీవితమే ధ్యేయంగా పెట్టుకొని; కంటికి కనిపించిన ప్రతి ఆనందం, వస్తువు తమ సొంతం చేసుకోవాలనే దుగ్ధతో జీవితాన్ని విలువలేని విషయానందానికై వెచ్చించి ఒత్తిళ్లకు గురి చేసుకొని లక్ష్యసాధనను మర్చిపోతున్నారు.

ఈ నేపథ్యంలో వివేకానందుల జీవితం, వారి సందేశం యువతకు మరియు ప్రతి ఒక్కరికీ ప్రయోజనకారి కాగలవు. మన అధ్యాత్మిక నిధుల నిగూఢ సత్యాలను అతి శులభమైన శైలిలో ఆధునిక శాస్త్ర ఆలోచనా సరళితో మేళవించి విశదీకరింపబడినవి. స్వామి వివేకానంద జీవితం, సందేశం సర్వకాల సర్వావస్థలయందు మానవాళిని మతాలకు, జాతులకు అతీతంగా ఉత్తేజింపజేయగలవు. వారి సందేశం యువతలో శక్తిమంతమయిన జాగృతిని కలిగించి నిత్య జీవితంలో ఎదురయ్యే సమస్యలను ఎదుర్కొనడానికి కావలిసిన ఆత్మస్థైర్యం, విశ్వాసం, ధైర్య సాహసాలను మేల్కొలుపుతాయి. అంతేగాక వారిలో ప్రేమ, సేవాభావం, స్ఫూర్తిని నింపి సన్మార్గములో నడిపిస్తాయి.



జీవితంలో ఎదురయ్యే కష్టాలను, సందిగ్ధతల నుంచి బయటపడ గలిగే మార్గాలను తెలియజేస్తాయి.

వివేకానందుని సంపూర్ణ సాహిత్యమైన లేవండి, మేల్కొనండి! అనే పది భాగాల సంపుటి నుండి కొన్ని బోధనలు, సందేశాలను సేకరించి ఈ పుస్తకంలో పొందుపరచాం. ఇప్పటికే పది భాగాల సంపుటి ఆంగ్లం మరియు తెలుగులో వేలాది ప్రతులు అమ్ముడుపోయాయి. స్వామి వివేకానంద 150వ జయంతి మహోత్సవ ప్రచురణగా ఈ పుస్తకాన్ని మీ ముందుంచుతున్నాం.

– ప్రకాశకులు



## విషయ సూచిక







# విజయానికి మార్గం



లే! మేలుకో! గమ్యం చేరే వరకు విశ్రమించకు.

## ***** 1. ఆలోచనా శక్తి *****

* పని చేయడం చాలా అవసరం. దానికి మూలం ఆలోచనే కదా! కండరాల ద్వారా కొద్దిగా అభివ్యక్తమైన శక్తిని పని అంటారు. అయితే ఆలోచన లేనిదే ఏ పనీ జరుగదు. కాబట్టి మీ బుద్ధిని ఉన్నతమైన ఆలోచనలతో, అత్యున్నతమైన ఆదర్శాలతో నింపి, రేయింబవళ్ళు వాటిని మీ ముందు ఉంచండి. తత్ఫలితంగా మహోన్నతమైన కార్యాలు సిద్ధిస్తాయి.

* ఒక భావాన్ని స్వీకరించండి. దాన్ని మీ జీవిత ధ్యేయంగా చేసుకోండి. దాన్నినే మననం చేయండి, కలగనండి, ఆ భావంలోనే లయించి జీవించండి. మీ మెదడు, కండరాలు, నరాలు, శరీరంలోని ప్రతి ఒక్క భాగం ఆ భావంతో పూర్తిగా తాదాత్మ్యం కావాలి. తక్కిన అన్ని భావాలను త్రోసిరాజనండి. ఇదే విజయానికి దారి.

* మీరు ఐదు భావాలను జీర్ణం చేసుకొని, వాటిని మీ జీవనంలో, మీ వ్యక్తిత్వంలో సారూప్యాన్ని పొందించు కుంటే; ఒక గ్రంథాలయాన్నంతా కంఠస్థం చేసిన వ్యక్తి కంటే, మీకే ఎక్కువ విద్య వచ్చినట్లు!

* ఆలోచనే మనలను కార్యోన్ముఖులను చేసే గొప్ప శక్తి. మనస్సును అత్యున్నతమైన ఆలోచనలతో నింపండి. ప్రతి రోజూ వాటిని వినండి. నెలల తరబడి వాటిని గూర్చి ఆలోచించండి. అపజయాలను లక్ష్య పెట్టవద్దు. అవి చాలా స్వాభావికం. ఈ అపజయాలు జీవితానికి అలంకారాలు. అవి లేకుండా జీవితమేమిటి? జీవితంలో పోరాటాలే లేకుండా ఉంటే, ఈ జీవితానికి ప్రయోజనం శ్యూనం.

* దురభ్యాసాలను మానాలంటే, వాటికి వ్యతిరేక మైన అభ్యాసాలను అవలంబించటమే ఉపాయం. దుష్ట సంస్కార జనిత దురభ్యాసాలను, మంచి అభ్యాసాలతో నిరోధించాలి. అందుకని మీరు ఎప్పుడూ మంచినే చేస్తూ ఉండండి. ఎప్పుడూ పవిత్రమైన ఆలోచనలనే చేస్తూండండి. దుష్ట సంస్కారాలను నిరోధించడానికి ఇదే మార్గం.





* ప్రతి వాక్కు ప్రతి సంకల్పం, ప్రతి చేష్ట, మీకు సంచిత ఫలాన్ని చేకూరుస్తుందన్న విషయాన్ని ఎప్పుడూ గుర్తుంచుకోండి. చెడు ఆలోచనలు, చెడు పనులు పెద్ద పులుల లాగా మీ పైకి దూకడానికి సిద్ధంగా ఉంటాయి. అయితే ప్రేరణనిచ్చే ఆశ కూడా ఉంది. మంచి ఆలోచనలు, మంచి పనులు, కొన్ని వేల దేవతాగణాల శక్తితో మిమ్మల్ని సదా, సర్వదా రక్షించగలవు.

* బాల్యం నుండీ సానుకూలమైన, ఉత్సాహకరమైన, బలప్రదమైన, ఆశాజనకమైన ఆలోచనలు వారి (పిల్లల) మెదళ్ళలో ప్రవేశింపనివ్వండి.

* భౌతికంగా చూస్తే చెడు ఆలోచనలే వ్యాధిని కలిగించే విషక్రిములు.

* అంతర్గతంగా ఉన్న భావనే దేహాన్ని రూపొంది స్తుంది. ఒకదేశ ప్రజానీకం, ఆ దేశీయ భావాల అభివ్యక్తమే!

* మనం పరిశుద్ధులమై, మంచి ఆలోచనలకు ఉపకరణమైతే, అవి మనలో ప్రవేశిస్తాయి. మంచి మనసు

చెడు ఆలోచనలను గ్రహించదు. చెడు ఆలోచనలు, చెడ్డ వారిలోనే అనుకూలమైన స్థానాన్ని గుర్తించ గలవు. అవి, అనుకూల పరిస్థితులలోనే పుట్టి పెరిగి వ్యాపించే సూక్ష్మ క్రిముల వంటివి.

* ఎప్పుడూ నిరాశతో, నిరుత్సాహంతో జీవించే వారు ఏ పనినీ సాధించలేరు.





## 2. ప్రార్థన

* ప్రార్థన వల్ల ఒక వ్యక్తిలోని సూక్ష్మమైన అంతర్గత శక్తులు సులభంగా జాగృతమౌతాయి.

* ప్రార్థన సమయంలో దేవుడు మనందరికీ జనకుడని భావిస్తూ, నిత్య జీవితంలో తోటి మానవుని సోదరునిగా పరిగణించకపోతే ప్రయోజనం ఏమిటి?

* ప్రార్థన, స్తోత్రం - ఆధ్యాత్మిక మార్గంలో పురోగమించడానికి ప్రాథమిక సాధనాలు.

* నిజమైన ప్రార్థన తీవ్ర కాంక్షయే, తప్పు మాటలు కాదు. అయితే, మీ ప్రార్థనలకు సమాధానం వస్తుందో, లేదో వేచి చూడడానికి మీలో ఓర్పు ఉండే తీరాలి.

* నైరాశ్యం ఏమైనా గావచ్చుగాని అది మతం మాత్రం కాదు. ఎప్పుడూ సంతోషంగా, దరహాసవదనంతో

ఉంటే అది నిన్ను ప్రార్థన కంటే అవలీలగా భగవంతుని దగ్గరకు చేరుస్తుంది.

* మాతృరూపమే శక్తి యొక్క ప్రథమ అభివ్యక్త స్వరూపం. విశ్వంలో ఉన్న యావత్తు శక్తి యొక్క స్వరూపమే జగన్మాత. మాతృభావంతో సుప్రతిష్ఠులమైతే మనం ఏ కార్యాన్నైనా నిర్వర్తించగలం. ఆమె మన ప్రార్థనకు సత్వరమే సమాధానం చెబుతుంది.

* ఒక వ్యక్తి భగవంతుణ్ణి, 'ఇది ఇవ్వు, అది ఇవ్వు' అని ప్రార్థించడం ప్రేమ కాదు. అది ప్రేమ ఎలా అవుతుంది? నేను నిన్ను ప్రార్థిస్తున్నాను, ప్రతిఫలంగా నువ్వు నాకు ఏదో కొంచెం ఇవ్వు; అదే కదా జరుగుతుంది. ఇది కేవలం వ్యాపారం.

* కష్టపడి పని చేయకుండానే, ప్రార్థన చేయడం వల్ల అద్భుతమైన ఫలితాలను పొందడానికి అదేమైనా గారడీ సూత్రమా? కాదు. అందరూ కష్టపడి పని చేయవలసిందే. ఆ అనంత శక్తి గంభీరతను అందరూ చేరుకోవలసిందే.





నిరుపేదల్లోను, ధనికుల్లోను సమానంగా అదే అనంత శక్తి ఉంది. ఫలితాలు పొందడానికి ఒకరు శ్రమించి పని చెయ్యాలి మరొకరు కొన్ని మాటలు వల్లిస్తేనే చాలనటం సరికాదు. ఈ విశ్వం ఒక నిరంతర ప్రార్థన. మీరు ప్రార్థనను ఈ విధంగా భావిస్తే, నేను మీతో ఏకీభవిస్తాను. మాటలు అవసరం లేదు. మౌన ప్రార్థనే శ్రేష్ఠం.





మనస్సును నిగ్రహించాలంటే చిత్తశుద్ధి తప్పనిసరి!

## ****** 3. ఏకాగ్రత ******

*ఏకాగ్రతే జ్ఞానమంతటికీ సారం. ఇది లేకుంటే ఏదీ సాధ్యం కాదు. ఒక సామాన్యమైన మానవుని ఆలోచనా శక్తి, నూటికి తొంభైవంతులు నష్టమైపోతూ ఉంటుంది. అందుకే అతను ఎప్పుడూ తప్పులు చేస్తూనే ఉంటాడు. సుశిక్షితుడు ఎప్పుడూ తప్పు చేయడు.

* మనస్సు ఏకాగ్రమైందని మనకెలా తెలుస్తుంది? కాలాన్ని గూర్చిన భావన మనలో పూర్తిగా పోతుంది. మనకు తెలియకనే ఎంత కాలం గడుస్తుందో, అంత ఏకాగ్రత మనకు కలిగినట్లు గ్రహించాలి. నిత్య జీవితంలో మనమొక పుస్తకాన్ని చదవడంలో నిమగ్నమైతే, కాలం విషయమై మనకేమాత్రం స్ఫురణే ఉండదు. పుస్తకాన్ని చదవడం ముగించాక, అబ్బా ఎన్ని గంటలు గడిచాయో అని మనం ఆశ్చర్యపోతూంటాం.

❋ మనస్సు శాంతితో, ఏకాగ్రతతో ఉన్నప్పుడే, మన శక్తి అంతా ఉత్తమ కార్యసాధనలో వినియోగపడగలదు. ఈ ప్రపంచంలో ప్రభవించిన ఉన్నతమైన కార్యశీలుర జీవితచరిత్రలను చదివితే వారంతా అసాధారణమైన స్థిరచిత్తులని గ్రహించగలరు.

❋ విద్య అంటే, మన మనస్సును అనేకానేక విషయాలను సేకరించి నింపడం కాదు. మన పరికరాన్ని లోపరహితంగా తీర్చిదిద్ది, మనస్సుపై పూర్తి సాధికారకతను పొందడమే. (ఇదే విద్య యొక్క ఆదర్శం). నేను నా మనస్సును ఒక విషయంపై ఏకాగ్రం చెయ్యాలనుకుంటే అది అక్కడకు వెళ్తుంది. నేను పిలిచిన తక్షణమే అది (మరలా) స్వతంత్రమవుతుంది.

❋ మనం, ఒక క్షణమైనా మన మనస్సులను శాసించ లేకుండా, ఒక విషయంపై మనస్సును కేంద్రీకృతం చేయ లేకుండా; మిగిలిన అన్ని విషయాలను వదిలిపెట్టి, మనస్సును ఏకైక విషయంపై, క్షణమైనా ఏకాగ్రం చేయ





లేకుండా ఉన్నాం! అయినప్పటికీ మనల్ని స్వతంత్రుల మని అంటున్నాం! దీన్ని గురించి ఆలోచించండి.

❋ ఏకాగ్రతా శక్తిని ఎలా పొందాలో బోధించే విజ్ఞాన శాస్త్రమే రాజయోగం.

❋ ధనార్జనలోనైనా, భగవధారాధనలోనైనా, మరే ఇతర కార్యంలోనైనా, ఏకాగ్రతా శక్తి ఎంత అధికంగా ఉంటుందో ఆ కార్యం కూడా అంత చక్కగా నిర్వహించ బడుతుంది.

❋ మనస్సు ఎంత నిర్మలమైతే, దాన్ని నిగ్రహించడం అంత సులభమౌతుంది. మనసును నిగ్రహించాలనుకుంటే, చిత్త శుద్ధికి తప్పకుండా ప్రాధాన్యం ఇవ్వాలి.

❋ మనస్సును ఒక వస్తువుపై ఏకాగ్రం చేసిన తరువాత దాన్ని మన సంకల్పంతో విడివడ చేయలేక పోవడం ప్రమాదకరం. ఈ స్థితి గొప్ప బాధను కలుగ చేస్తుంది. మనలో ఈ 'అనాసక్తి' అనే శక్తి లేకపోవడమే, ఇంచుమించుగా మన అన్ని దుఃఖాలకు కారణం.

* పిల్లల్లో ఏకాగ్రతా శక్తిని, అనాసక్తిని మిగిలిన వాటితో పాటుగా పెంపొందించాలి.

* నియమితమైన ప్రాణాయామం, శరీరాన్ని సామరస్యమైన స్థితిలో ఉంచుతుంది; అప్పుడే మనసును వశపరచుకోవడం సులభమవుతుంది. ఆ సందర్భంలో సామాన్యమైన ప్రాణాయామం మాత్రమే అవసరమై ఉంది. ఈ విధంగా మనం శరీరంపై నియంత్రణను పొందగలం, తరువాత శరీరం యొక్క సూక్ష్మక్రియలను, సూక్ష్మం మరియు చాలా అంతర్గతమైన క్రియలను, ఇలా మనం మనస్సును చేరుకునే వరకు అనుభూతిని పొందుతాం. అప్పుడు మనస్సు మన నియంత్రణలోనికి వస్తుంది.





## 4. ధ్యానం

* ధ్యానమంటే ఏమిటి? ధ్యానమంటే ప్రకృతికి బానిస కావడాన్ని ప్రతిఘటించ గలిగేలా మనల్ని సమర్థులను చేసే శక్తి. నువ్వు నా దానవు; నువ్వు దేన్నీ చూడకు, వినకు అని నేను మనస్సును ఆజ్ఞాపిస్తాను; ఈ విధంగా ఒకరు మనస్సుకు చెప్పేలా ఉండాలి. అప్పుడు మనస్సు దేన్నీ చూడదు, వినదు. ఏ రూపంగాని, శబ్దంగాని మనస్సును చలింపచేయలేదు. తరువాత మనస్సును శాంతపరచాలి. అది, బహిర్ముఖమై పరిగెత్తుతుంది. నేను ధ్యానం చేయ డానికి కూర్చోగానే లోకంలోని తుచ్ఛ విషయాలన్నీ తలెత్తుతాయి. నేను ఆలోచించ వద్దనుకున్న విషయాలను గురించి మనస్సెందుకు ఆలోచించాలి? నేను ఎందుకు మనస్సుకు బానిసనైపోయాను. ధ్యానమంటే వీటినన్నిటినీ ప్రతిఘటించ గలిగేలా మనల్ని సమర్థులను చేసే శక్తి.

❋ ధ్యానం ఎలా సాధ్యం? ఎన్నో విధాల సాధ్యమవుతుంది. ఒక్కో స్వభావం ఉన్నవారికి ఒక్కో మార్గం ఉంది. కాని, సామాన్య సూత్రం ఇది; మనస్సును స్వాధీనపరచుకోవాలి. మనస్సు ఒక సరోవరం లాంటిది. దాన్లో పడ్డ ప్రతి రాయి, తరంగాలను కల్పిస్తుంది. ఈ తరంగాలు మన యథార్థ తత్త్వాన్ని చూడనివ్వవు. సరోవరాన్ని శాంతిని పొందనివ్వవు. ప్రకృతిని నీ మనస్సులో తరంగాలను కల్పించనివ్వకుండా చెయ్యి. శాంతంగా ఉండు. కొంత సమయం తరువాత ప్రకృతి ఇక నీ జోలికి రాదు. అప్పుడు మన యథార్థతత్త్వం మనకు ప్రత్యక్షమౌతుంది.

❋ ధ్యానం అంటే మనస్సును ఒకే విషయంపై కేంద్రీకరించడం. మనస్సుకు ఒక్క విషయంపై ఏకాగ్రత కుదిరితే దాన్ని మిగిలిన ఏ విషయం మీదనన్నా ఏకాగ్రం చేయవచ్చు. ఏ పనికిమాలిన బాహ్యవస్తువు పైనైనా ధ్యానం అభ్యసిస్తే అది మానసిక ఏకాగ్రతకు దారి తీస్తుంది. కాని, దేని మీద మనస్సు సులభంగా నిలుస్తూ ఉంటుందో, దాని మీద ధ్యానం చేస్తే మనస్సు చాలా సులభంగా ప్రశాంతత చెందుతుందనడం సత్యం.





❋ ఊహా శక్తి, దివ్య ప్రేరణకు నాంది. అంతేకాక ఆలోచనలకు ఆధారం. అందరు ఆచార్యపురుషులు, కవులు, శోధకులు, గొప్ప ఊహా శక్తి కలవారు. యోగసాధనలో సాఫల్యానికి అత్యావశ్యకమైన గుణాలు మూడు-

*1.* పవిత్రత - శారీరక, మానసిక శుద్ధి. మనస్సును క్రిందికి లాగే అపరిశుద్ధమైన ప్రతిదాన్ని వదిలి పెట్టాలి.

*2.* సహనం - సహనం వహిస్తే తప్పకుండా ఫలితం లభిస్తుంది.

*3.* పట్టుదల - కష్టం వచ్చినా, సుఖం వచ్చినా, ఆరోగ్యంగా ఉన్నా, అనారోగ్యంగా ఉన్నా; ఒక్క రోజు కూడా సాధనను మానవద్దు. స్నానం చేసిన తరువాత స్థిరంగా కూర్చో. నువ్వు ఒక కొండలా స్థిరంగా కూర్చున్నట్లు నిన్ను ఏదీ కదిలించలేదని భావించుకో. తల, భుజాలు, పిరుదులు ఒకే దిశలో నిటారుగా

ఉంచి, వెన్నెముకను స్వేచ్ఛగా వదిలి పెట్టాలి. వెన్ను ఎముక వెంట యోగశక్తి ప్రవహిస్తుంది కాబట్టి వెన్నెముక నిరపాయంగా ఉండాలి. తరువాత శరీరమంతా పరిశుద్ధంగా ఉందనీ, అది సత్యాన్ని ప్రాప్తించుకోడానికై భగవంతుని ద్వారా ఇవ్వబడిన యంత్రమని భావించు. రెండు నాసికా రంధ్రాల ద్వారా పూర్తిగా శ్వాసను తీసుకుని, దాన్ని బయటకు వదలి పెట్టు. ఇప్పుడు నీకు అనుకూలంగా ఉన్నంత వరకు శ్వాసను పీల్చకుండా (బహి కుంభకం) ఉండు. ఇలా నాలుగు ప్రాణాయామాలు చెయ్యి. తరువాత మామూలుగా శ్వాసను కొనసాగించి, ఆత్మానుభూతికై ప్రార్థించు. మనం ఈ అస్థిరమైన మనస్సును పట్టుకోవాలి. తిరుగుతున్న ఈ మనస్సును తీసుకువచ్చి ఒకే భావంలో నిలపాలి. ఇలా పదే పదే చేయాలి.

* మనసును నిగ్రహించడానికి చాలా తేలిక మార్గం ఒకటుంది. శాంతంగా కూర్చొని మనస్సును దాని ఇష్టం





వచ్చినట్లు కొంతసేపు పోనివ్వు. 'ఈ మనస్సు తిరుగుతుంటే, దాన్ని చూస్తూ నిలబడ్డ సాక్షిని నేను; నే నీ మనస్సును కాను' అని దృఢంగా భావించు. తర్వాత మనస్సు నీ నుంచి పూర్తిగా భిన్నమైనదిగా భావించు.

* పరమ పూజ్యుడు, నిస్సంగుడు అని నువ్వు భావించే ఒక పవిత్ర పురుషుని, ఒక మహాత్ముని లేదా ఒక పుణ్య పురుషుని హృదయాన్ని భావించు. ఆ రాగరహితమైన హృదయాన్ని ధ్యానించడం వల్ల మనస్సు శాంతిని పొందుతుంది.

* నీ హృదయాకాశం మధ్యలో ఒక జ్యోతి ప్రకాశిస్తూ ఉన్నట్లు భావించు. ఆ జ్యోతి నీ ఆత్మ అనుకో. ఈ జ్యోతి మధ్యలో దివ్య తేజస్సుతో వెలిగే కాంతిని ఊహించుకో. అది పరమాత్మ అనుకో. ఆ పరంజ్యోతిని హృదయంలో ధ్యానించు.





బలమే జీవనము, బలహీనతే మరణము.

## 5. బలం - నిర్భీతి

✻ అనంతమైన శక్తే ధర్మం, అదే దైవం. దౌర్బల్యాన్ని; దాస్యాన్ని వీడు.

✻ నీవు దుర్బలుడవనుకుంటే దుర్బలుడవవుతావు; బలవంతుడవనుకుంటే బలవంతుడవవుతావు.

✻ పాపం అనేది ఏదైనా ఉంటే ఇది ఒక్కటే - నీవు దుర్బలుడవని లేదా ఇతరులు దుర్బలురని అనడం.

✻ నా వయస్సు పెరిగే కొద్దీ; అంతా పురుషప్రయత్నం మీదనే ఆధారపడి ఉందని స్పష్టంగా అనిపిస్తున్నది. ఇది నా నూతన సందేశం!

✻ నా పుత్రులారా! పిరికి పందలు, దుర్బలులు మాత్రమే పాపం చేస్తారు, అసత్యం చెబుతారు. ధైర్యవంతులు

ఎప్పుడూ నీతిమంతులే! నీతిమంతులుగా, ధైర్యవంతులుగా, సానుభూతిపరులుగా ఉండడానికి ప్రయత్నించండి.

* బలమే జీవితం, దౌర్బల్యమే మృత్యువు. బలమే ఆనందమయమైన, అమరమైన, అనంతమైన జీవితం. దౌర్బల్యం నిరంతర శ్రమ, దుఃఖం. దౌర్బల్యమే మృత్యువు.

* ఉక్కు నరాలు, తెలివైన బుద్ధి ఉంటే లోకమంతా నీకు పాదాక్రాంతమవుతుంది.

* ధైర్యం వహించు. సత్యాలను సత్యాలుగా ఎదుర్కో. దుష్ట శక్తి వల్ల జగత్తులో తరమబడవద్దు.

* లేవండి, మేల్కోండి, ఇక నిద్ర చాలించండి! అన్ని కోర్కెల్నీ, అన్ని దుఃఖాల్నీ అధిగమించే అద్భుతశక్తి మీ ప్రతి ఒక్కరిలోనూ ఉంది.

* రహస్య ప్రచారం, మూఢవిశ్వాసం ఎప్పుడూ దుర్బలతకు చిహ్నాలు. ఇవి పతనానికి, మరణానికి చిహ్నాలు. కాబట్టి, వీటి విషయంలో జాగ్రత్తగా ఉండండి.





* నీవు మొట్టమొదట నేర్చుకోవలసిన పాఠం ఇది; నీ దుఃఖాలకు, అపజయాలకు బయట ఉన్న దేనిని నిందించకూడదని, ఇతరులెవ్వరిపైనా దోషాన్ని ఆరోపించకూడదని దృఢ నిర్ణయం తీసుకో. మనుష్యుడవు, లే! దోషాన్ని నీ మీదే ఉంచుకో. అదే సదా సత్యమని నువ్వు గ్రహిస్తావు.

* నీ లోపాలకై, ఎవరినీ నిందించ వద్దు. నీ కాళ్ల మీద నీవు నిలబడి, బాధ్యతనంతా నీవే వహించు. 'నేను అనుభవిస్తున్న ఈ దుఃఖం నా కర్మ ఫలం అని తెలుసుకో. ఈ దుఃఖం నా చేతనే నివారింపబడగలదని నిరూపిస్తోంది', అని చెప్పు.

* నా యువ మిత్రులారా, బలిష్ఠులు కండి! ఇదే నేను మీకిచ్చే సలహా! దుర్బలుడవై భగవద్గీతను అధ్యయనం చేయడం కన్నా ఫుట్‌బాల్ ఆట ద్వారానే మీరు స్వర్గానికి దగ్గర కాగలరు. ఇవి సాహసోపేతమైన వచనాలు! అయినా నేను వాటిని చెప్పవలసి ఉంది. ఎందుకంటే నేను మిమ్మల్ని ప్రేమిస్తాను. 'చెప్పు' ఎక్కడ కరుస్తుందో నాకు తెలుసు.

నేను కొంచెం అనుభవాన్ని పొందాను. మీ భుజాలు, మీ కండరాలు, ఇంకా కొంచెం బలపడినప్పుడు మీరింకా బాగా గీతను అర్థం చేసుకోగలరు. మీలో కొంచెం బలమైన రక్తం ప్రవహించినప్పుడు శ్రీకృష్ణుని ప్రతిభా విశేషాన్ని, మహా బలాన్ని చక్కగా అర్థం చేసుకోగలరు. మీ పాదాల మీద మీ శరీరం దృఢంగా సుస్థిరంగా నిలిచినప్పుడు, మీరు నిజమైన పురుషులమని భావించినపుడు; ఉపనిషత్తులను, ఆత్మ మహిమను సమగ్రంగా గ్రహించగలరు.

* దేనికీ భయపడవద్దు. నీవు అద్భుతమైన కార్యాలను చేయగలవు. భయపడిన తక్షణమే నీ వెందుకూ పనికి రాకుండా పోతావు. లోకంలోని దుఃఖానికంతకూ ముఖ్య కారణం, ఈ భయమే. మనం అనుభవించే అనర్థాలకు భయమే కారణం. కాని నిర్భయత్వం ఒక్క క్షణంలో స్వర్గాన్ని తెచ్చి పెట్టగలదు. అందుకే; 'లే, మేలుకో గమ్యం చేరే వరకు ఆగవద్దు!'

* ఒక జాతి పరంగా మనల్ని బలహీనులను చేసే అన్నింటినీ గడచిన వేయి సంవత్సరాలుగా మనం





కూడగట్టుకున్నాం. అందుకే నా మిత్రులారా! మీలో ఒకనిగా, మీతో బాటుగా జీవించి, మరణించే ఒక వ్యక్తిగా, నన్ను చెప్ప నివ్వండి. 'మనకు కావలసింది బలం, బలం, ఎపుడూ బలమే కావలసి ఉంది!' ఉపనిషత్తులు బలం గురించి నొక్కి వక్కాణిస్తున్నాయి. ఈ ప్రపంచమంతటినీ సజీవం చేసే శక్తి వాటిలో ఉంది. అన్ని జాతుల్లోను, అన్ని మతాల్లోను, అన్ని సంప్రదాయాల్లోను ఉన్న దుర్బలులను, దుఃఖితులను, పీడితులను శంఖధ్వని లాంటి ముక్త కంఠంతో ఈ ఉపనిషత్తులు 'మీ పాదాలపై మీరు నిలబడి, స్వతంత్రులు కండి!' అని ఘోషిస్తున్నాయి.



## ***** 6. ఆత్మవిశ్వాసం *****

* మనపై మనకు విశ్వాసాన్ని చేకూర్చే ఆదర్శం మనకు అత్యంత ప్రయోజనకరం. ఈ ఆత్మవిశ్వాసం అత్యధికంగా బోధించి పాటించి ఉంటే మనమిప్పుడు అనుభవించే, అనర్థాలు, దుఃఖాలు, చాలా వరకు సమసి పోయి ఉండేవని నా దృఢ విశ్వాసం.

* మనిషికి, మనిషికి మధ్య గల భేదం విశ్వాసంలో ఉన్న భేదమే తప్ప వేరేమీ కాదు. ఒక వ్యక్తిని ఉన్నతుణ్ణి గాను, మరొకర్ని దుర్బలుని గాను, అధముని గాను చేసేది ఈ విశ్వాసమే!

* మానవ చరిత్రను పరికిస్తే; ఉన్నతులైన స్త్రీ పురుషుల జీవితాల్లో అన్నింటికంటే ఎక్కువగా సామర్థ్యాన్ని ఇచ్చిన మూల శక్తి వారి ఆత్మవిశ్వాసమే! వాళ్ళు ఉన్నతులు కాగలరనే విశ్వాసంతో జన్మించారు, ఉన్నతులే అయ్యారు.





* ఒక మనిషి ఎంత అధమాధమ స్థితికి వెళ్ళినప్పటికీ, ఆ నిరాశ వలనే అతను ఊర్ధ్వ గమనాన్ని సాగించి ఆత్మవిశ్వాసాన్ని నేర్చుకునే సమయం వచ్చి తీరుతుంది. అయినా మొదటి నుండి మనం దానిని తెలుసు కొనడం శ్రేయస్కరం. ఆత్మవిశ్వాసాన్ని పొందడానికై మనం ఇన్ని కష్టాలు పడటం ఎందుకు?

* నా ధీర యువకులారా! మీరందరూ మహత్కార్యాలు సాధించడానికై జన్మించారనే విశ్వాసాన్ని కలిగి ఉండండి. కుక్కపిల్లల అరుపులు మిమ్మల్ని భయపెట్టకుండు గాక! అంతే కాదు, ఆకాశం నుండి పిడుగులు పడ్డా కూడా చలించకుందురు గాక! లెండి, కార్యోన్ముఖులు కండి!

* మన రక్తంలో సాహసం, ఉత్సాహం తప్పకుండా ఉండాలి... మీరు పేదవారనీ, మీకు స్నేహితులు లేరనీ అనుకోకండి! ఓహో! ధనం మనిషిని తయారు చేయగా ఎవరైనా చూశారా? మనిషే ఎప్పుడూ ధనాన్ని తయారు చేస్తాడు. ఈ ప్రపంచమంతా మానవుని సామర్థ్యంతో, ఉత్సాహశక్తితో, విశ్వాసశక్తితో నిర్మాణమయింది,

✻ తనను తాను ద్వేషించుకో నారంభించిన వ్యక్తికి పతనద్వారం తెరవబడినట్లే! ఒక దేశం విషయంలో కూడా ఇదే వర్తిస్తుంది.

✻ ఆత్మవిశ్వాసాన్ని పోగొట్టుకోవడం అంటే భగవంతునిపై విశ్వాసాన్ని కోల్పోవడమే! నీలో, నీ ద్వారా పని చేస్తున్న ఆ అనంతమైన శుభంకర దైవంలో నీకు విశ్వాసం ఉందా? ఈ సర్వవ్యాపి అంతర్యామి ప్రతి పరమాణువులో వెలసి; నీ మనో-శరీరాలలో ఓతప్రోతంగా (సంపూర్ణంగా) వ్యాపించి ఉన్నట్లు నీవు విశ్వసిస్తే ఇక నీవెలా అధైర్య పడగలవు?

✻ మన పూర్వుల హృదయాల్లో ఈ ఆత్మవిశ్వాసం ఉంది. నాగరకత యొక్క అభివృద్ధిలో వారిని ముమ్ముందుకు తోసుకుని వచ్చిన క్రియా శక్తి ఈ ఆత్మవిశ్వాసమే! మనకు ఎప్పుడైనా అధఃపతనం వాటిల్లితే, దోషం చేకూరితే నా మాటను గుర్తుంచుకోండి. మన ప్రజలు ఈ ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయిననాడే ఆ అధఃపతనం ఆరంభమయింది.





✻ విశ్వాసం! విశ్వాసం! విశ్వాసం! మనపై మనకు విశ్వాసం!! భగవంతునిపై విశ్వాసం!! ఇదే ఉన్నతికి రహస్యం!





సర్వాన్నీ సాంధిచగలిగేది ధృఢమైన సంకల్పశక్తే!

## 7. సంకల్ప శక్తి

* మహత్కార్యాలు ఎన్నడైనా విఘ్నాలు లేకుండా సులభంగా సాధించబడతాయా? సమయం, సహనం, అంతులేని సంకల్పంతోనే ఇవి సాధించబడతాయి.

* విజయం పొందాలంటే, అంతులేని పట్టుదలను, ప్రబలమైన సంకల్ప శక్తిని నీవు కలిగి ఉండాలి. 'నేను సముద్రాన్నే తాగేస్తాను. నా సంకల్ప శక్తితో పర్వతాలు కూడా పొడి పొడి కావలసిందే!' అని పట్టుదల గలవాడు అంటాడు. అటువంటి వీర్యోత్సాహంతో, దృఢ సంకల్పంతో కష్టపడి పని చేయి. తప్పక గమ్యాన్ని చేరతావు.

* ఒక్క క్షణమైనా భయపడకు. సంకల్పశక్తితో అంతా చక్కగానే జరుగుతుంది. ఈ సంకల్ప శక్తే ప్రపంచాన్ని కదిలించి వేస్తుంది.

* ప్రగాఢమైన సంకల్ప శక్తి సర్వాన్నీ సాధిస్తుంది.

* మార్పు వలన సంకల్పం బలపడదు. అది బలహీనమై, మార్పులకు బానిసవుతుంది. కాని మార్పుల్ని మనం ఎప్పుడూ జీర్ణించుకోవాలి. అందువల్ల, సంకల్పం మరింత బలపడుతుంది.

* ప్రేమ, సంకల్ప శక్తినంతటినీ అప్రయత్నంగానే ఏకాగ్రం చేస్తుంది.

* సంకల్ప శక్తి, మిగిలిన అన్నిటికంటే బలవత్తర మైనది. అది సాక్షాత్తు భగవంతుని నుండే వస్తుంది కాబట్టి దాని ముందు మిగిలినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన సంకల్పం సర్వశక్తిమంతమైనది.

* శ్వాసకోశాన్ని వ్యవస్థాబద్ధం చేసే కేంద్రానికి నాడీకోశం ఒక విధంగా అధీనమై పని చేస్తూ ఉంటుంది. క్రమ గతిలో శ్వాసిస్తే, శరీరంలోని పరమాణువులు అన్నీ ఒకే వైపుకు కదిలేందుకు సిద్ధమై ఉంటాయి. మనస్సు





సంకల్పంగా మారినప్పుడు నాడీ తరంగాలు విద్యుచ్ఛక్తి వలే చలనంలోకి మారతాయి. సంకల్పం నాడీ ప్రవాహంగా రూపొందినప్పుడు, అది విద్యుత్తులాంటి ఒక శక్తిగా మారుతుందని మనకు దీని వల్ల తెలుస్తోంది కదా! శరీరంలోని చలనాలన్నీ పూర్తిగా క్రమ గతిలో జరుగుతూ ఉంటే, అప్పుడు ఈ శరీరం సంకల్పమనే భారీ విద్యుద్ఘటంగా మారుతుంది.



## ✻✻✻✻✻ 8. విధి ✻✻✻✻✻

✻ మీ వ్యథలకు మీరే కారకులు. మంచి చెడులను నిర్మించింది మీరే. మీ చేతులతో కళ్ళు మూసుకొని చీకటి అంటున్నది మీరే. కళ్ళ నుంచి చేతులు తీసి, వెలుగును చూడండి. మీరు స్వయంప్రకాశకులు. మీరు మొదటి నుంచీ పరిపూర్ణులే!

✻ లేచి నిలబడు, ధైర్యం వహించు, బలవంతుడివి కా! బాధ్యతనంతా నీ భుజాలపైనే వేసుకుని, నీ విధికి నీవే కర్తవని తెలుసుకో. నీకు కావలసిన బలం, సహాయం అంతా నీలోనే ఉంది. అందుకే నీ భవితవ్యాన్ని, నీవే నిర్మించుకో.

✻ నిన్ను నువ్వే ఉద్ధరించుకో. మిత్రమా వేరెవరూ నీకు సహాయం చేయలేరు. నీకు నువ్వే ప్రబల శత్రువువి, నీకు నువ్వే ప్రగాఢ మిత్రుడవు.





✻ నీవు మొట్ట మొదట నేర్చుకోవలసిన పాఠం ఇది– బయట ఉన్న దేనినీ నిందించకూడదని, ఇతరులెవ్వరిపైనా దోషాన్ని ఆరోపించకూడదని దృఢ నిర్ణయం తీసుకో. మనిషిగా, దోషాన్ని నీ మీదే ఉంచుకో. అదే ఎప్పుడూ సత్యమని నీవు గ్రహిస్తావు.

✻ తమ దోషాలను ఇతరుల నెత్తిపై వేసే ప్రయత్నం వారిని మరింత బలహీనుల్ని చేస్తుంది. అందుకే నీ లోపాలకై ఎవరినీ నిందించవద్దు. నీ కాళ్ళ మీద నీవు నిలబడి, బాధ్యతనంతా నీవే వహించు. 'నేను అనుభవిస్తున్న ఈ దుఃఖం నా కర్మ ఫలం. ఈ విషయమే, ఈ దుఃఖం నా చేతనే నివారించబడగలదని నిరూపిస్తోంది' అని చెప్పు.

✻ లే! పోరాడు! ఒక్క అడుగు కూడా వెనక్కు వెయ్య వద్దు. ఇదే భావం... ఏమైనా రానీ, పోరాడి తేల్చుకో. గ్రహ తారలు గతులు తప్పనీ! లోకమంతా నిన్ను ప్రతిఘటించనీ! మరణమంటే దుస్తులు మార్చుకోవడమే. దానిలో ఏముంది? అందుకే పోరాడు! పిరికివాడివైతే నీకు ఒరిగేదేమీ లేదు.

ఒక్క అడుగు వెనక్కు వెయ్యడం వలన నీవు ఏ ఆపద నుండీ తప్పించుకోలేవు. మృత్యువుతో పోరాటం... నువ్వు అనంతుడివి, అమరుడివి, జన్మ రహితుడివి. నువ్వు అనంతమైన ఆత్మవు కాబట్టి బానిసగా ఉండటం నీకు తగదు. లే! మేలుకో! లేచి పోరాడు.





## 9. సౌశీల్యం (నడవడి)

* ఈ విశ్వంలో మంచికి దారి కఠినంగాను, నిటారుగాను ఉంటుంది. అనేకులు సాఫల్యమవటం ఆశ్చర్యకరం. కాని అనేకమంది పడిపోవటం ఆశ్చర్యం కాదు. కొన్ని వేల తడబాటుల వల్లనే నడవడి ఏర్పడుతుంది.

* మీరు ఎప్పుడూ మంచినే చేస్తూండండి, ఎప్పుడూ పవిత్రమైన ఆలోచనలనే చేస్తూండండి. దుష్ట సంస్కారాలను అణచి వేయడానికి ఇదే మార్గం. ఒక వ్యక్తిని ఎప్పుడూ ఆశారహితుడని అనవద్దు. ఎందుకంటే అతను కొన్ని అభ్యాసాలతో కూడిన వ్యక్తిత్వాన్ని మాత్రమే నిర్దేశిస్తున్నాడు. మంచి నూతన అభ్యాసాలతో తన పూర్వ అభ్యాసాలను నిగ్రహించవచ్చు. పునరావర్తన అభ్యాసాల ఫలితమే శీలం. అందుకే పునరావర్తన అభ్యాసాలు మాత్రమే సౌశీలాన్ని పునర్మించగలవు.

* మనం మార్పు చెందితే ఈ ప్రపంచం కూడా మార్పు చెందుతుంది; మనం పరిశుద్ధులమైతే ఈ లోకం పరిశుద్ధమౌతుంది.

* ఒక వ్యక్తి వ్యక్తిత్వాన్ని పరిశీలిస్తే, ఆ వ్యక్తిత్వాన్ని నిర్మించటంలో సుఖదుఃఖాలు రెండూ సమపాళ్ళని గ్రహించవచ్చు. వ్యక్తిత్వ నిర్మాణంలో మంచీ చెడులు సమాన భాగాన్ని కలిగి ఉన్నాయి. కొన్ని సందర్భాలలో సుఖం కంటే దుఃఖమే గొప్ప బోధకునిగా ఉంటుంది.

* అల్పులు కూడా ఏదో విధమైన ఘనతను సాధించే గొప్ప సందర్భాలు వస్తాయి. కానీ, ఎవరి వ్యక్తిత్వం ఎప్పుడూ ఉన్నతంగా ఉంటుందో, ఎలాంటి పరిస్థితులలో ఉన్నా ఒకే రీతిలో ఉంటుందో, అతడే యథార్థంగా మహాత్ముడు.

* లోకంలోని మతాలన్నీ జీవం లేని పరిహాసాస్పదాలుగా మారాయి. ఈ లోకానికి కావలసింది సౌశీల్యం. ఎవరి జీవితం ఉజ్జ్వల ప్రేమయుతమై, నిస్స్వార్థమై ఉంటుందో అలాంటివారే ఈ ప్రపంచానికి ఆవశ్యకమై ఉన్నారు. అలాంటి నిస్స్వార్థ ప్రేమతో కూడిన ప్రతి మాటా పిడుగుపాటు అవుతుంది.

* వేచి ఉండు. ప్రయోజనకారి అయ్యేది డబ్బు కాదు, పేరు కాదు, కీర్తి కాదు, పాండిత్యం కాదు. ప్రయోజనకారి అయ్యేది ఒక్క ప్రేమే! దుర్భేద్యాలైన గోడలలాంటి కష్టాలను ఛేదించగలిగేది ఒక్క సౌశీల్యమే.





మహాత్యాగాల వల్లే మహాకార్యాలు నెరవేరుతాయి.

## 10. నిజమైన సుఖం

* సుఖం దుఃఖం అనేవి ఒకే నాణెపు రెండు ప్రక్కల వంటివి. సుఖాన్ని స్వీకరించేవాడు, దుఃఖాన్ని కూడా స్వీకరించాలి. దుఃఖం లేని సుఖాన్ని పొందగలమని మనందరి వెఱ్ఱి ఆలోచన. ఆ ఆలోచనకు మనమెంత లొంగి ఉన్నామంటే ఇంద్రియాలపై మనకు అదుపే లేదు.

* సుఖం, దుఃఖమనే కిరీటాన్ని ధరించి మానవుని వద్దకు వస్తుంది. సుఖానికి స్వాగతం చెప్పేవాడు దుఃఖానికి కూడా స్వాగతం చెప్పి తీరవలసిందే!

* కోరికలు ఎంత కాలం ఉంటాయో, అంత వరకు నిజమైన సుఖం కలగదు.

* మనం, ఓర్పును, సహనాన్ని, క్షమా వృత్తిని అలవరచుకునే తీరాలి. ఈ శాశ్వతమైన నీతి పాఠాన్ని

నేర్చుకుని దానికి కట్టుబడి ఉండడానికి సిద్ధమైనవారు ఆనందమయమైన జీవితాన్ని గడుపుతారు.

* ఏకాకిగా ఉన్నవారే సుఖవంతులు. అందరికి ఉపకారం చేయి. అందరినీ ఇష్టపడు. కానీ ఎవరినీ ప్రేమించ వద్దు. అది ఒక బంధం. బంధం దుఃఖాన్నే కలిగిస్తుంది. నీ మనస్సులో ఏకాకివై జీవించు. అదే ఆనందం.

* నిజమైన విజయానికి, నిజమైన సుఖానికి గొప్ప రహస్యం ఇది; ఎవరు ప్రతిఫలాన్ని ఆశించరో, ఎవరు పూర్తిగా నిస్వార్థపరులో వారే అందరికంటే ఎక్కువగా విజయవంతులు కాగలరు.

* మనం సుఖంగా ఉండడానికి అత్యంత సులభ మైన మార్గం ఇతరులు సుఖంగా జీవించేలా చేయడమే!

* యంత్రాలు ఎప్పుడూ మనిషికి సుఖాన్ని ఇవ్వలేవు, ఎప్పటికీ ఇవ్వలేవు కూడా. తన మనస్సును జయించిన





వ్యక్తి మాత్రమే సుఖాన్ని పొందగలడు, మిగిలిన వారెవ్వరూ పొందలేరు. నీవు విశ్వాన్నంతా లోబరచుకున్నా, విశ్వంలోని ప్రతి అణువును వశపరచుకున్నా నీకు కలిగే ప్రయోజనం ఏముంది? ఆనందమనే శక్తి నీ హృదయంలో లేనంత వరకూ, ఆత్మ విజయాన్ని నీవు పొందనంత వరకూ, అది నీకు సుఖాన్ని ఇవ్వలేదు.



# 11. ఆరోగ్యం

* జీవాత్మకు నివాసమైన ఈ శరీరం కర్మకు నిజమైన ఉపకరణం. దీనిని నరక కూపంగా మార్చేవాడు, నిర్లక్ష్యం చేసేవాడు, వీరిద్దరూ నిందార్హులే.

* మన శారీరక బలహీనతే మన దుఃఖాలలో కనీసం మూడింట ఒక భాగానికి కారణం.

* నియమిత వ్యాయామం లేకుంటే ఈ శరీరం సరిగా ఉండదు. ఎల్లప్పుడూ మాట్లాడటం వల్ల అనారోగ్యం కలుగుతుంది. ఇది యథార్థమని తెలుసుకో.

* నీ శరీరాన్ని బలిష్ఠంగా ఉంచడం నేర్చుకొని, దీనిని ఇతరులకు బోధించు. ఉదయం, సాయంకాలం నడుస్తూ, శరీర పరిశ్రమ చేయి. మనస్సు, శరీరాలు సమానంగా వృద్ధిచెందాలి.





* అపరిశుద్ధ జలం, అపరిశుద్ధాహారం అన్ని వ్యాధులకు కారకాలు.

* ఆందోళన, వ్యాధి కంటే నికృష్టం.

* నీవు బలంగా, ఆరోగ్యంగా ఉంటే, నీ చుట్టూ ఉన్నవారు కూడా, బలంగా, ఆరోగ్యంగా ఉండే అవకాశం ఉంది; అయితే నీవు రోగగ్రస్థునిగా, బలహీనంగా ఉంటే నీ చుట్టూ ఉన్నవారు కూడా అలాగే మారే అవకాశముంది.

* భావన చాలా శక్తిమంతమైనపుడు, ఆ వస్తువు ప్రత్యక్షమవుతుంది. కాబట్టి దాని సహాయంతో మన శరీరాలను ఆరోగ్యమైన లేదా అనారోగ్యమైన స్థితికి తీసుకురావచ్చు. భావన – ఆరోగ్యం, బలాలను గురించిన ఆలోచనలను అంటిపెట్టుకొని ఉండాలి. అపుడే, శరీరం వ్యాధిగ్రస్థమైనపుడు, ఆరోగ్యానికి ఆదర్శమైన స్మృతి జాగృతి కాగలదు.

* నక్షత్రాలను రానివ్వు, దానిలో హాని ఏముంది? ఒక నక్షత్రం నా జీవితాన్ని కలత పరచగలిగితే, అది ఒక్క

పైసాకు కూడా సమానం కాదు. జ్యోతిషం మరియు ఈ రహస్య విషయాలన్నీ సాధారణంగా బలహీనమైన మనస్సుకు గుర్తని మీరు తెలుసుకోగలరు. అందుకే మన మనస్సులలో అవి ప్రబలమైన వెంటనే, మనం ఒక వైద్యుణ్ణి సంప్రదించి, మంచి ఆహారం, విశ్రాంతి తీసుకోవాలి.





## 12. ఆహారం

* ముందుగా పుష్టికరమైన ఆహారంతో నీవు శరీరాన్ని దృఢతరం చేసుకోవాలి. అప్పుడే మనస్సు బలవత్తర మౌతుంది. శరీరంలోని సూక్ష్మ భాగమే మనస్సు.

* మనం అనుభవించే దుఃఖంలో ఎక్కువ భాగం మనం తీసుకునే ఆహారం వల్లే కలుగుతుంది. ఎక్కువ ఆహారాన్ని, జీర్ణం కాని ఆహారాన్ని తీసుకున్న తరువాత మనస్సును నిగ్రహించడం చాలా కష్టమని మీరు గ్రహించ గలరు. అది ఎప్పుడూ చంచలమై తిరుగుతూ ఉంటుంది.

* పోషక విలువలు ఎక్కువగా గల ఆహారాన్ని మాత్రమే తీసుకోవాలి. ఎక్కువ మొత్తం అన్నంతో కడుపు నింపటం సోమరితనానికి మూలం. జపాన్ దేశస్థులను చూడు, వారు బటానీ రసంతో రోజుకు రెండు మూడుసార్లు

ఆహారం తీసుకుంటారు. అయితే బలిష్టమైనవారు కూడా రోజుకు ఎక్కువ(చాలా)సార్లు భోజనం చేసినా, ప్రతిసారీ తక్కువ మోతాదులో ఆహారం తీసుకుంటారు.

* సక్రమ ఆహారం అంటే సాత్విక ఆహారం. మసాలాలు ఎక్కువగా ఉన్నది కాదు.

* కొవ్వు పదార్థాలు, నూనె పదార్థాలు ఎక్కువగా తీసుకోవడం మంచిది కాదు. లూచీ (పూరీ) కంటే రొట్టె మంచిది.

* నీకు ఆకలి వేస్తే తీపి పదార్థాలను, నేతిలో వేయించిన వాటిని మురికికాలవలో పారేసి, ఒక పైసా విలువ చేసే మరమరాలు కొను. అది చౌకే కాక ఎక్కువ పుష్టికరం కూడా. అన్నం, పప్పు, (పొట్టుతియ్యని) గోధుమ పిండి చపాతీలు, చేపలు, కూరగాయలు, పాలు - ఈ ఆహారాన్ని తీసుకుంటే సరిపోతుంది.

* మన దేశంలో, సంపన్నులు నానా రకాలైన తీపి పదార్థాలను, నేతిలో వేయించిన పదార్థాలను తమ





పిల్లలకు తినిపిస్తారు. ఎందుకంటే వారికి అన్నం, చపాతీలు మాత్రమే పెడితే జనం ఏమంటారో కదా! అది, వారికి ఎంత అవమానకరం! ఇలాటి ఆహారంతో పెరిగిన పిల్లల నుంచి నీవు ఏమి ఆశించగలవు? సారూప్యత లేని శరీరం గల వారిని, సోమరులను, ఎందుకూ పనికిరాని బుద్ధిహీనులను, తమకంటూ వెన్నెముక లేనివారినే కదా మనం ఆశించగలం.





శ్రద్ధాభక్తులతో కూడిన ప్రతీ పని ఈశ్వరారాధనే!

## 13. కర్తవ్యం

* మనల్ని మనం ద్వేషించుకోకుండా ఉండటమే మన ప్రథమ కర్తవ్యం. ఎందుకంటే, అభివృద్ధి చెందడానికి, ముందు ఆత్మవిశ్వాసం ఉండాలి, తరవాత భగవంతునిపై విశ్వాసం కలిగి ఉండాలి. తనపై తనకు విశ్వాసం లేని వానికి భగవంతునిపై ఎన్నటికీ విశ్వాసం కలుగదు.

* ప్రతి వ్యక్తి సొంత ఆదర్శాన్ని తీసుకుని, దానిని సాధించడానికి ప్రయత్నించాలి. తానెన్నటికీ సాధించే ఆశ లేని ఇతరుల ఆదర్శాలను ఆచరించడం కంటే, తీసుకొన్న ఆదర్శాన్ని సాధించే వరకు ప్రయత్నించడమే పురోగతికి ఖచ్చితమైన మార్గం.

* మనకు అతి సమీపంలో ఉన్న కర్తవ్యాన్ని, ఇప్పుడు మన చేతిలో ఉన్న కర్తవ్యాన్ని చక్కగా నిర్వర్తించడం వలన మనం బలిష్ఠులమౌతాం. ఇలా క్రమక్రమంగా మన

శక్తిని వృద్ధి చేసుకుంటే సంఘంలోనూ, జీవితంలోనూ అత్యధిక గౌరవ ప్రదమైన, మహత్తరమైన విధులను నిర్వహించ వలసిన స్థితికి కూడా మనం చేరగలం.

✻ ప్రతి కర్తవ్యమూ పవిత్రమైనదే. శ్రద్ధాభక్తులతో కూడిన కర్తవ్య నిర్వహణ పరమోత్కృష్టమైన ఈశ్వరారాధన.

✻ నువ్వొక పనిని చేస్తున్నప్పుడు దానికి మించి వేరే దేనినీ ఆలోచించవద్దు. దాన్ని ఆరాధనగా, మహోన్నత ఆరాధనగా ఒనర్చు. ఆ పని చేస్తున్నంత సేపు నీ జీవిత మంతా దానికే అర్పించు.

✻ అత్యంత నిమ్నమైన కర్మలను కూడా నిరసించ కూడదు. నువ్వు ఒక వ్యక్తికి సహాయం చెయ్యాలనుకుంటే, అతడికి నీ పట్ల ఎలాంటి వైఖరి ఉండాలనే విషయాన్ని గురించి ఎప్పుడూ ఆలోచించ వద్దు. ఒక సత్కార్యాన్నో, ఘనకార్యాన్నో నువ్వు చెయ్యాలనుకుంటే, ఎలాంటి ఫలితం కలుగుతుందో అని ఆలోచించకు.





✻ సోమరితనాన్ని అన్ని విధాలా తొలగించుకోవాలి. ఎప్పుడూ కార్యపరత్వం అంటే ప్రతిఘటనే. శారీరక, మానసికమైన అన్ని దౌష్ట్యాలను ఎదుర్కో. ఈ ప్రతిఘటనలో నీవు సఫలతను పొందినప్పుడే నీకు శాంతి కలుగుతుంది.

✻ కౌశలంతోనూ, శాస్త్ర దృష్టితోనూ కర్మను నిర్వర్తించడాన్నే కర్మయోగమని భగవద్గీత వెల్లడిస్తూంది; కర్మను ఎలా నిర్వర్తించాలో తెలుసుకోవడం ద్వారా మహోన్నత ఫలితాలను పొందవచ్చు.

✻ భవిష్యత్తులో ఏమి జరుగుతుందోనని ఎప్పుడూ లెక్క పెట్టే వాడు దేన్నీ సాధించ లేడు. సత్యమని, మంచిదని, నీవు అర్థం చేసుకున్న దాన్ని తక్షణమే ఆచరించు.

✻ నీవు శ్రద్ధాభావంతో ఏమి చేసినా, నీ కది మేలే. చాలా చిన్న పనినైనా, సవ్యంగా చేస్తే మహాద్భుత ఫలితాన్ని ఇస్తుంది. కాబట్టి ప్రతి వ్యక్తి తాను చేయగల ఎంత చిన్న పనినైనా, శ్రద్ధతో నిర్వహించాలి.

* భగవంతుని వైపు వెళ్ళేలా చేసే ఏ కార్యమైనా సత్కార్యమే, అదే మన ధర్మం; మనల్ని అధోగతికి చేరేలా చేసే ఏ కార్యమైనా దుష్కార్యమే, అది మన ధర్మం కాదు.

* అల్పమైన పనులను చేసేవాడు అందుకే అల్పుడు కాడు. ఏ వ్యక్తినీ కేవలం అతని పనుల స్వభావాన్ని బట్టి మాత్రమే అంచనా వేయకూడదు. తమ కర్మలను ఏ విధంగా, ఎంత అంకిత భావంతో నిర్వర్తిస్తారో దాన్ని బట్టి అందరినీ అంచనా వేయాలి.

* ప్రతి కార్యం - అవహేళన, ప్రతిఘటన, తరువాత అంగీకారం. ఈ మూడు దశలను దాటవలసి ఉంటుంది. తానున్న కాలానికంటే ముందుగా ఆలోచించే ప్రతి వ్యక్తినీ లోకం అపార్థం చేసుకోవడం సహజం. కాబట్టి ప్రతిఘటన, హింస అనివార్యాలు. నేను స్థైర్యంగా, పవిత్రంగా ఉంటూ భగవంతునిపై అచంచలమైన విశ్వాసం కలిగి ఉండాలి. అప్పుడు ఇవన్నీ అదృశ్యమవుతాయి.

* ఒక అధికారిగా ఉండే ప్రయత్నం చేయవద్దు. చక్కగా సేవించగలవాడే ఉత్తమ అధికారి. మరణం





సంభవించినా సత్యాన్ని విడువకు. మనకు కావలసింది పని మాత్రమే. మనం కోరేది సంపదలు కాదు, పేరు ప్రతిష్ఠలూ కాదు. ధీరుడవై ఉండు. సంపూర్ణంగా నిస్వార్థుడవై ఉండు. అపుడు నీవు తప్పకుండా జయిస్తావు.

* సమయోచిత ధర్మాన్ని అనుసరించడం ఉత్తమ మార్గం. దానిని కేవలం ఒక ధర్మంగా భావించి, ఆచరిస్తే అది మనకు బంధాన్ని కలిగించదు.

* ఈ లోకంలో ఎంత అల్ప వస్తువుకైనా సరే, మనం సహాయపడగలమని ఎన్నడూ భావించకూడదు. మనం సహాయం చెయ్యలేం. ప్రపంచమనే ఈ వ్యాయామశాలలో మనకు మనమే మేలు చేసుకోగలం. కర్మాచరణలో ఇదే సరైన మనోవైఖరి.

* నీ వెప్పుడైనా, ఏ పనినైనా చేస్తానని వాగ్దానం చేస్తే, దానిని ఖచ్చితంగా నియమిత సమయానికే నిర్వర్తించాలి. లేదంటే ప్రజలు నీ పట్ల విశ్వాసాన్ని కోల్పోతారు.

* పని చేయడం ప్రారంభించు. అప్పుడు నీలో ఎంత గొప్ప శక్తి వస్తుందంటే, దాన్ని భరించడం నీకు కష్టమని

పిస్తుంది. ఇతరుల కోసం ఏమాత్రం చిన్న పని చేసినా అది మనలో ఉన్న శక్తిని మేల్కొల్పుతుంది.

* కర్మఫలంపై ఆసక్తి చూపే వ్యక్తి, తనకు ప్రాప్తమైన కర్తవ్య స్వభావాన్ని గురించి గొణుగుతాడు. అనాసక్తితో పని చేసే వ్యక్తికి అన్ని కర్మలూ సమానంగా మంచివే.

* నా జీవితంలో నేర్చుకున్న గొప్ప పాఠాలలో ఇదొకటి. కర్మ యొక్క లక్ష్యం పట్ల ఎంత శ్రద్ధ వహించాలో దాని సాధన పట్ల కూడా అంతే శ్రద్ధ వహించాలి. సాధన సరిగ్గా ఉంటే లక్ష్యం వచ్చి తీరుతుంది.

* నీకు చేతనైనంత ఉన్నతంగా చేయి. నీరంతా పోయిన తరువాత నదిని దాటుదామని నిరీక్షించకు. కానీ, నా వత్సలారా! ఎప్పుడూ ఏదో వ్రాస్తూ, మాటలాడటం కంటే అసలైన పని ఎంతో మంచిది.

* తనదైన ఉన్నత స్వీయ ఆదర్శాన్ని అనుసరించడానికి, ఆ ఆదర్శాన్ని సత్యానికి వీలైనంత చేరువగా ఉంచే ప్రయత్నంలో ప్రతి వ్యక్తిని ప్రోత్సహించడమే మన కర్తవ్యం.





## 14. విద్య

* 'నేను జీవించినంత కాలం నేర్చుకుంటూనే ఉంటాను.' కాని, గమనించాల్సిన విషయం ఒకటుంది. ఇతరుల నుండి మనం ఏదైనా విషయాన్ని గ్రహించినప్పుడు మన మార్గానికి అనువుగా దాన్ని మలచుకోవాలి.

* మన సౌశీల్యం కనుమరుగైపోయింది. మన పాశ్చాత్య విద్య, దేనినీ వదిలి పెట్టకుండా అంతటినీ నాశనం చేసింది. మన పిల్లలు, విధేయతగా ఉండడాన్ని కోల్పోయారు. చక్కగా మాట్లాడ్డమనేది లోపిస్తోంది. తమ పెద్దలతో మర్యాదగా వ్యవహరించడమనేది లుప్తమయింది. మర్యాద లేకపోవడం స్వేచ్ఛకు చిహ్నమయింది. మనం మన పూర్వ విధేయతా స్వభావాన్ని తిరిగి అలవర్చుకోవలసిన సమయం ఆసన్నమయింది.

✻ మంచిదే, కొన్ని పరీక్షల్లో ఉత్తీర్ణం కాగలిగినంత మాత్రాన ఒక వ్యక్తిని విద్యావంతునిగా నీవు పరిగణిస్తున్నావు. జన సామాన్యానికి, జీవిత పోరాటాన్ని ఎదుర్కొనే సామర్థ్యాన్ని ఇవ్వలేనిది; శక్తిమంతమైన సౌశీల్యాన్ని, లోకోపకారం చేసే బుద్ధిని, సింహసదృశమైన ధైర్యాన్ని నింపలేని 'విద్య' నిరర్థకం కాదా? తన కాళ్ళ మీద తాను నిలబడగలిగేట్లుగా చేసేదే నిజమైన విద్య.

✻ విద్య అంటే ఏమిటి? పుస్తక జ్ఞానమా? కాదు. నానా విధమైన జ్ఞానమా? అదీ కాదు. సంకల్ప ప్రవాహాన్ని, సంకల్ప అభివ్యక్తీకరణను వశం చేసుకుని, వాటిని సరైన విధంగా కార్యరూపంలో పెట్టే శిక్షణను 'విద్య' అంటారు.

✻ మాటలను ప్రోగు చేసేది నిజమైన విద్యకాదు. ప్రజ్ఞను పెంపొందించేదే విద్య. సంకల్ప శక్తిని సరైన రీతిలో, నైపుణ్యంగా ఉపయోగించేలా, వ్యక్తులకు ఇచ్చే శిక్షణే విద్య.

✻ మీరు, వారికి (పిల్లలకు) నిర్మాణాత్మకమైన భావాలను అందివ్వగలిగితే, వాళ్ళు సార్థకమైన మనుషులుగా





రూపొంది తమ కాళ్ళ మీద తాము నిలబడటం నేర్చుకుంటారు. భాషలోను, సాహిత్యంలోను, కళలలోను, ప్రతి విషయంలోను ప్రజలు తమ ఆలోచనల్లో, ఆచరణల్లో చేసే దోషాలను మనం గుర్తు చేయకూడదు. కాని, ఈ పనులను మరింత చక్కగా చేసే విధానాన్ని వారికి తెలియజేయాలి.





వికాసమే జీవనం, సంకోచమే మృత్యువు.

## 15. ప్రేమ - నిస్వార్థత

✻ జీవితమంటే వికాసం. అంటే వ్యాకోచం, ప్రేమ గాక మరేమిటి? అందుకే ప్రేమంతా జీవితం, అది మాత్రమే జీవిత సూత్రం. స్వార్థంతో కూడినదంతా మృత్యువు. ఇహంలో, పరంలో కూడా ఇదే సత్యం; పరులకు మేలు చేయడం జీవితం, మేలు చేయకపోవడం మరణం.

✻ నా వత్సలారా! భయపడకండి. అనంతమైన నక్షత్రఖచితమైన అంతరిక్షం మీపై పడి మిమ్మల్ని అణచి వేస్తుందేమో అనే భయంతో దాన్ని చూడకండి. వేచి ఉండండి! కొద్ది గంటలలో అదంతా మీ పాదాక్రాంతం కాగలదు. వేచి ఉండండి! ప్రయోజనకారి అయ్యేది డబ్బు కాదు, పేరు కాదు, కీర్తి కాదు, పాండిత్యం కాదు. ప్రయోజన కారి అయ్యేది ఒక్క ప్రేమే. దుర్భేద్యాలైన గోడలలాంటి కష్టాలను ఛేదించగలిగేది ఒక్క సౌశీల్యమే.

* మనుష్యులై ఉండి, సాటి మానవునిపై సానుభూతి లేనివారిని మానవులనవచ్చునా?

* కర్తవ్యం చాలా అరుదుగా రుచిస్తుంది. ఆ చక్రం ప్రేమ స్నిగ్ధమైనప్పుడే సరళంగా నడుస్తుంది. లేదంటే అది నిరంతర సంఘర్షణే అవుతుంది. ప్రేమార్ద్ర హృదయులు కాకుంటే తల్లితండ్రులు తమ పిల్లల పట్ల, పిల్లలు తల్లితండ్రుల పట్ల, భార్యాభర్తలు ఒకరి పట్ల ఒకరు తమ కర్తవ్యాన్ని ఎలా నిర్వహించగలరు? మన జీవితంలో నిత్యం సంఘర్షణ కానరావడం లేదా? కర్తవ్యం, ప్రేమ ద్వారా మాత్రమే రుచించగలదు.

* నాయనా! ప్రేమకు ఎప్పుడూ ఓటమి లేదు; నేడో, రేపో, యుగాల తరువాతనో సత్యం జయించి తీరుతుంది. ప్రేమ విజయాన్ని సాధించి తీరుతుంది. సర్వశక్తిమంతమైన ప్రేమలో విశ్వాసముంచండి. పైకి తళతళ లాడుతున్న ఈ పేరు ప్రఖ్యాతులను ఎవరు లక్ష్య పెడతారు? మీలో ప్రేమ ఉందా? మీరు సర్వ శక్తిమంతులు. మీరు సంపూర్ణంగా





నిస్వార్థపరులా? అలా అయితే మిమ్మల్ని ఎవరూ నిరోధించలేరు.

* ఫిరంగి గుండు మహా వేగంతో వాయు మార్గంలో చాలా దూరం పోయి పడుతుంది. మరొకటి మార్గమధ్యంలో ఏ గోడకో కొట్టుకొని, అక్కడే ఆగి పోతుంది; ఆ దెబ్బకు అమితమైన వేడి జనిస్తుంది. అట్లే స్వార్థంతో కూడిన బాహ్య రూపంలో వెలువడే శక్తి అంతా వ్యర్థమౌతుంది; ఈ పరిణామం వల్ల నీవు ఎటువంటి శక్తిని పొందలేవు. అయితే దీనిని నిగ్రహిస్తే నీలోని శక్తి వృద్ధి చెందుతుంది. ఈ ఆత్మ నిగ్రహం మహోన్నత సంకల్ప శక్తినీ ఉద్భవింపచేస్తుంది.

* మన గురించి ముందుగా ఆలోచించుకునే స్వార్థపరత, మహా పాపం. 'నేను ముందుగా తింటాను, నేను ఇతరుల కంటే ఎక్కువ డబ్బు సంపాదిస్తాను, నేను అన్ని సంపదలను పొందుతాను' అని ఆలోచించేవాడు స్వార్థపరుడు. నిస్వార్థపరుడు 'నేను చివరి వరకు ఆగి ఉంటాను. నా సోదరులకు ఉపకారం కలిగితే, అందుకై

నేను నరకానికి పోవడానికైనా సంసిద్ధుడిగా ఉంటాను.' అని అంటాడు. ఈ నిస్వార్థతే మతానికి పరీక్ష! ఈ నిస్వార్థతే ఎవరిలో ఎంత ఎక్కువగా ఉంటే అతను అంత ఉన్నతమైన ఆధ్యాత్మికపరుడు.

* ఏ సందర్భంలోనైనా స్వార్థత్యాగంతోనే విజయం సాధించగలం. ఎంతగా నిస్వార్థులమైతే అంతగా విజయానికి చేరువవుతాం.

* నిస్వార్థత విశేష ప్రయోజనకారి. కాని దానిని అలవరచుకునే ఓర్పు ప్రజలకు లేదు. (నిస్వార్థతలో ఒత్తిడి, సంఘర్షణ ఉండవు కాబట్టి) ఆరోగ్యాన్ని బట్టి చూసినా అది ఎంతో లాభదాయకమే. ప్రేమ, సత్యం, నిస్వార్థత అనేవి కేవలం నైతికభాషాలంకారాలు కావు. అవి మనకు మహోన్నతమైన ఆదర్శాన్ని రూపొందిస్తాయి. ఎందుకంటే, వీటిలో అలాంటి గొప్ప శక్తి నిక్షిప్తమై ఉంది.

* నిరంతర వికాసమే జీవనం. సంకోచమే మృత్యువు. తన వ్యక్తిగత సుఖాలనే చూసుకుంటూ,





సోమరితనంతో గడిపే స్వార్థపరునికి నరకంలో కూడా స్థానంలేదు.

* దరిద్రునిలో, దీనునిలో, రోగిలో శివుణ్ణి చూడ గలిగినవాడు నిజమైన శివారాధకుడు. ప్రతిమలో మాత్రమే శివుని చూసేవాని పూజ ప్రారంభదశలోనిదే. మందిరాలలో మాత్రమే శివుని చూసేవానికంటే; జాతి, కులం, మతం లాంటి వేటినీ ఆలోచించక ఒక దరిద్రునిలో శివుణ్ణి చూసి, వానికి సహాయం, సేవ చేసిన వానిపై శివునికి ఎక్కువ ప్రీతి.

* మీ సోదర మానవులను మీరు ప్రేమిస్తున్నారా? భగవంతుని దర్శనానికై మీరెక్కడికి వెళ్ళాలి? దరిద్రులు, దుఃఖితులు, దుర్బలులు వీరంతా దైవాలు కారా? ముందుగా వారినెందుకు ఆరాధించవు?



## ***** 16. విజయం *****

* ధైర్యంతో ముందుకు సాగిపో. ఒక్క రోజులోనో లేదా ఒక్క సంవత్సరంలోనో విజయాన్ని సాధించగలవని ఆశించకు. ఎప్పుడూ అత్యున్నతమైన ఆదర్శాన్ని కలిగి ఉండు. స్థైర్యంగా ఉండు. ఈర్ష్యను, స్వార్థాన్ని విడిచిపెట్టు. సత్యానికి, మానవాళికి, నీ దేశానికీ విధేయుడవై, శాశ్వతంగా విశ్వాసపాత్రుడవై ఉంటే, నీవు ప్రపంచాన్నే కదిలించి వేయగలవు.

* భయపడకు. నీవు ఎన్నిసార్లు పరాజయం పొందావో ఆలోచించకు. దానిని లెక్కచేయకు. కాలం అనంతం. ముందుకు సాగిపో; నీ ఆత్మ శక్తిని మరల మరల కూడగట్టుకో, వెలుగు వచ్చే తీరుతుంది.

* విజయమొందిన ప్రతి వ్యక్తి వెనుక ఎక్కడో అంతు లేని (అసాధారణమైన) నిజాయితీ, అంతులేని అంకిత





భావం తప్పకుండా ఉంటాయి. అదే అతని అసాధారణ విజయానికి కారణం.

* మీ అన్యోన్య ప్రేమానురాగాల మీదే మీ కార్య సాఫల్యత పూర్తిగా ఆధారపడి ఉంది. అసూయ, ద్వేషం అహంకారం అనేవి చెలరేగుతున్నంత వరకు ఏ శ్రేయము కలుగదు. గుప్తంగా పరులను గురించి చెడుగా మాట్లాడటం పాపమని తెలుసుకో. దీన్ని పూర్తిగా విడిచిపెట్టాలి.

* స్థైర్యంతో పని చేయండి. ఇప్పటికే మనం అద్భుత కార్యాలను సాధించాం. ధీరాత్ములారా! ముందుకు సాగండి. మనం విజయం సాధిస్తాం!

* అనంతమైన ఓర్పు, అనంతమైన పవిత్రత, అనంతమైన పట్టుదల ఇవే సత్కర్మ సఫలమవటంలోని రహస్యాలు.

* ధైర్యంతో పని చేయి. ఓర్పు, స్థైర్యంతో పని చేయడం ఇది ఒక్కటే మార్గం. ముందుకు సాగిపో; ఓర్పు–పవిత్రత–ధైర్య స్థైర్యాలను కలిగి, నీవు పవిత్రునిగా ఉంటూ,

నీ సిద్ధాంతాలకు కట్టుబడి ఉన్నంత కాలం నీకు అపజయం కలగదని గుర్తుంచుకో!

* ప్రతి పని సాఫల్యానికి ముందు వందలాది ఇబ్బందులను అధిగమించ వలసి ఉంది. ఎవరు పట్టుదలతో వేచి ఉంటారో వారు శీఘ్రంగా గాని, ఆలస్యంగా గాని వెలుగును తప్పక చూస్తారు.

* విధేయత, సంసిద్ధత, కర్తవ్యం మీద ప్రేమ – ఈ మూడూ మీలో ఉంటే, మిమ్మల్ని ఏదీ అడ్డుకోలేదు.

* పళ్ళను, నీడను ఇచ్చే విశాల వృక్షాన్ని ఆశ్రయించాలి. ఒకవేళ మనకు పళ్ళు లభించకపోతే, దాని నీడను అనుభవించడానికి మనల్ని ఎవరు అడ్డుపెడతారు? అదే విధంగా గొప్ప ప్రయత్నాలు చేయాలన్నదే నీతి.

* సహనం లేని వ్యక్తి ఎన్నటికీ విజయం పొందలేడు.

* ఈ ప్రపంచం పిరికిపందల కోసం కాదు. పారిపోవడానికి ప్రయత్నించకు. జయాపజయాలను లక్ష్యపెట్టకు.





నిన్ను నువ్వు సంపూర్ణమైన నిస్వార్థసంకల్పంతో అనుసంధించుకుని పని చెయ్యి. విజయాన్ని సాధించడానికే జన్మించిన మనస్సు అచంచలమైన దృఢ సంకల్పంతో కూడి పట్టుదలతో సాధన చేస్తుందని తెలుసుకో.

* నిన్నెక్కడికి తీసుకు వెళ్ళినా సరే, సత్యాన్నే అనుసరించు. పిరికితనంతో, వంచనతో ఉండకు. పవిత్రతను సాధించే పోరాటంలో మరణించు; మృత్యుదేవతకు వేయిసార్లు స్వాగతం చెప్పు. నిరాశపడకు. ఉత్తమమైన అమృతం లభించకపోతే మనం విషాన్ని గ్రహించాలనుకోవడం సహేతుకం కాదు.

* నా జీవితమంతా నేను నమ్మిన సత్యం, నా భావన ఇది – సహాయానికై భగవంతుణ్ణి ఆశ్రయించాలి గాని, వేరెవ్వరినీ కాదు. ఇదొక్కటే విజయానికి రహస్యం.





మనిషిలో ఉన్న దివ్యత్వాన్ని వ్యక్తీకరించడమే మతం.

## ***** 17. నిజమైన మతం *****

* మతం అంటే, స్వతఃసిద్ధంగా మనిషిలో ఉన్న దివ్యత్వాన్ని వ్యక్తం చేయడం.

* పవిత్రంగా నిస్వార్థంగా ఉండడానికి సదా ప్రయత్నించు. మత సారమంతా ఇదే!

* వితంతువుల కన్నీళ్ళు తుడిచివేయలేని, అనాథుల నోటికి పట్టెడన్నం అందించలేని దేవుని గాని, మతాన్ని, గాని నేను  నమ్మను.

* నీతిమంతునిగా ఉండు. ధైర్యశాలిగా ఉండు. విశాల హృదయంతో ఉండు. నీతి మార్గానికి కట్టుబడి ఉండు. తెగింపు అనిపించే ధైర్యం వహించు. మత సిద్ధాంతాలతో నీ తలను బరువెక్కించుకోవద్దు. పిరికి పందలు మాత్రమే పాపం చేస్తారు, ధైర్యవంతులు ఎప్పుడూ

చేయరు; వీరు మనస్సులో కూడా పాపాన్ని తలవరు. ఎటువంటి వారైనా సరే, ప్రతి ఒక్కరినీ ప్రేమించు. మానవునిగా మెలగు.

* సమస్త మానవాళి పట్ల ప్రేమ, కరుణ ఇదే నిజమైన ధార్మికతకు పరీక్ష!

* నీవు నిస్వార్థపరుడవా? కాదా? అన్నదే ప్రశ్న. నీవు నిస్వార్థపరుడవైతే ఒక్క ధార్మిక గ్రంథాన్నైనా చదువ కుండానే, ఒక్క మందిరానికైనా లేదా చర్చికైనా (ప్రార్థనాల యానికైనా) వెళ్ళకుండానే నీవు పరిపూర్ణుడవవుతావు.

* ఈ జీవితంలో మహోన్నతమైన ఆదర్శం బలమే! మిగిలిన అన్ని విషయాల్లో లాగే మతంలో కూడా మిమ్మల్ని బలహీనులుగా చేసే వాటినన్నిటినీ విసర్జించండి. వాటితో మీకెలాటి సంబంధమూ ఉండకూడదు.

* మతం గురించి ఎప్పుడూ కలహించకు. మతానికి సంబంధించిన కలహాలు, వివాదాలు మనలో ఆధ్యాత్మికత





లేదని తెలియజేస్తాయి. మతకలహాలు ఎప్పుడూ నిరర్థక విషయాలపైనే జరుగుతుంటాయి. పవిత్రత, ఆధ్యాత్మికత లేనపుడు ఆత్మ శుష్కించిన తరువాతే కలహాలు ఆరంభ మవుతాయి; అంతకు ముందు అవి జరుగవు.

* మతాన్ని, విద్య యొక్క అంతర్గత సారంగా నేను భావిస్తాను. గుర్తుంచుకో, మతాన్ని గురించి నాకు లేదా ఇతరులకున్న అభిప్రాయాన్ని ఉద్దేశించి నేను చెప్పడం లేదు. ఇతర విషయాల్లో లాగే, దీన్లో కూడా గురువు శిష్యుని యొక్క ఆరంభ స్థితిని తీసుకుని, శిష్యుణ్ణి తనదైన దారిలో వీనలైనంత తక్కువ ఘర్షణతో అభివృద్ధి చెందెలా సహ కరించాలని నా అభిప్రాయం.



## 18. భారతదేశం

✻ కోట్ల మంది అన్నార్తులై, అజ్ఞానులై జీవించినంత వరకు, వారి శ్రమ ఫలితంగా తాము విద్యావంతులై, వారిని పూర్తిగా నిర్లక్ష్యం చేస్తూ, వారి సంక్షేమాన్ని పట్టించుకోని ప్రతి ఒక్కరినీ, నేను దేశద్రోహిగా జమకడతాను.

✻ నేను మన దేశస్థులతో 'ఇంత వరకు మీరు బాగానే చేశారు. ఇప్పుడు మరింత బాగా చేసే సమయం ఆసన్న మయింది' అని చెబుతాను.

✻ పని! పని! పనినే చేయి. వ్యర్థప్రసంగాలకు స్వస్తి చెప్పు; భగవత్ప్రసంగాలు చేయి. జీవితం ఎంత చిన్నదంటే మిథ్యాప్రసంగాలకు, మోసాలకు వ్యవధి లేదు. ప్రతి జాతి తనను తానే రక్షించుకోవాలన్న విషయాన్ని నీవు ఎప్పుడూ గుర్తుంచుకో. ప్రతి వ్యక్తి విషయంలో కూడా ఇంతే; ఇతరుల సహాయానికై ఎదురుచూడకు.





✻ మన దేశమంతా తమోగుణంలో మునిగిపోయి ఉంది, అంతకంటే వేరేమీ కాదు. ముందు మనకు కావలసింది రజోగుణం, తరువాత సత్వగుణం కలుగు తుంది. ఇది ప్రస్తుతానికి సుదూరమైన విషయం.

✻ మనంతట మనం ఏమీ చెయ్యం, ఏమైనా చేయడానికి ప్రయత్నించేవారిని అవహేళన చేస్తాం. ఒక జాతిగా ఇదే మన అధోగతికి కారణం. సానుభూతి లేక పోవడం, సామర్థ్యం లేకపోవడం, ఇదే దుఃఖానికంతకూ మూల కారణం. అందుకే, ఈ రెంటినీ మీరు విడనాడాలి. ఎవరిలో ఏ శక్తి సామర్థ్యాలు ఉన్నాయో భగవంతుడికి గాక మరెవరికి తెలుసు? అందరికీ అవకాశాలు కల్పించు, మిగిలినది భగవంతుని మీద వదిలి పెట్టు.

✻ మన దేశానికి ఇప్పుడు కావలసింది ఇనుప కండరాలు, ఉక్కు నరాలు. ఇంకా ఎవ్వరూ నిరోధించలేనిదీ, జగత్తులోని రహస్యాలను ఛేదించగలిగేది అయిన వజ్ర సంకల్పం! మహా సముద్రంలో అట్టడుగునకు మునగవలసి

వచ్చినా, ముఖాముఖీ మరణాన్ని ఎదుర్కోవలసి వచ్చినా, లక్ష్యాన్ని ఏ విధంగానైనా సాధించగలిగే దృఢసంకల్పం మనకు కావలసి ఉంది.

* దేశభక్తిలో నాకు విశ్వాసం ఉంది, దేశభక్తిని గురించి నాకంటూ సొంత ఆదర్శాలు కూడా ఉన్నాయి. ఘనకార్యాలు సాధించడానికి మూడు విషయాలు అవసరం. మొట్టమొదటిది, హృదయపూర్వకమైన సానుభూతి. బుద్ధిలో గాని తర్కంలో గాని ఏముంది? అది నాలుగడుగులు మాత్రం పోయి, అక్కడ ఆగిపోతుంది. కాని, హృదయం ద్వారా ప్రేరణ కలుగుతుంది. ప్రేమ చాలా దుస్సాధ్యమైన ద్వారాలను తెరుస్తుంది; జగద్రహస్యాలన్నిటికీ ప్రేమ సింహద్వారం. కాబట్టి, సంస్కర్తలు కాగోరే మహాశయులారా! దేశభక్తులు కాగోరే మహాత్ములారా! ముందు సానుభూతిని అలవరచుకోండి. మీకు సానుభూతి ఉందా? దేవతల, మహాపురుషుల సంతానంలో లక్షల కొద్దీ జనం నేడు పశుప్రాయులైపోయారని మీరు నిజంగా దుఃఖిస్తున్నారా? లక్షలాది జనం నేడు ఆకలితో అలమటిస్తున్నారని, కొన్ని





లక్షలమంది జనం అనేక యుగాల నుండి తిండి లేక పస్తులుంటున్నారనీ మీరు దుఃఖిస్తున్నారా? అజ్ఞానం, నల్లని మబ్బులా ఈ మాతృభూమిని కప్పివేసిందని మీరు ఆరాట పడుతున్నారా? అది మీ హృదయాలను కలచి వేస్తోందా? అది మీకు నిద్ర లేకుండా చేస్తోందా? అది రక్త నాళాల ద్వారా మీ రక్తంలో ప్రవేశించి, మీ హృదయ స్పందనలతో సమన్వయం చెందుతుందా? అది మిమ్మల్ని ఇంచుమించు పిచ్చివారిని చేస్తుందా? సర్వం నాశనమై పోయిందన్న దుఃఖమయమైన ఆ ఒక్క చింత మిమ్మావహించిందా? పేరు ప్రతిష్ఠలను, మీ ఆలు బిడ్డలను, మీ ఆస్తి పాస్తులను, మీ శరీర సౌఖ్యాలను అన్నిటినీ మరచిపోయారా? అలాంటి హృదయస్పందన మీలో కలిగిందా? దేశభక్తులు కావడానికి ఇది మొదటి మెట్టు, అన్నిటి కంటే మొట్టమొదటి మెట్టు.

* మీకు సానుభూతి ఉందనుకుందాం; అయితే వ్యర్థ ప్రసంగాలతో మీ శక్తినంతా వృథా చేసేకన్నా ఈ దుఃస్థితి నుండి బయటపడే ఏదైనా మార్గాన్ని, ఆచరణయోగ్యమైన ఏదైనా పరిష్కారాన్ని మీరు కనుగొన్నారా? తిరస్కారానికి

బదులుగా కొంత సహాయాన్ని, వారి దుఃఖాలను ఉపశమింప జేయడానికై కొన్ని మంచి మాటలను, బ్రతుకుతూ మరణించే ఈ స్థితి నుండి వారిని బయటికి తీసుకు రావడానికై ఏదైనా ఉపాయాన్ని మీరు తెలుసుకున్నారా?

* ఉన్నతమైన భావాలను ప్రతి ఒక్కరి ద్వారం వద్దకు తీసుకువెళ్ళేలా ఒక వ్యవస్థీకరణను రూపొందించాలన్నదే నా జీవిత ఆశయం. అపుడు స్త్రీ, పురుషులను వారి భవితను వారినే నిర్ణయించుకోనివ్వండి. ప్రధానమైన జీవిత సమస్య లను గూర్చి మన పూర్వీకులు, ఇతర దేశాలవారు ఏమి ఆలోచించారో వారిని తెలుసుకోనివ్వండి. ముఖ్యంగా ఇతరులు ఇప్పుడు ఏమి చేస్తున్నారో చూసిన తరువాత వారిని నిర్ణయించుకోనివ్వండి.





## 19. మహిళలకు, జనబాహుళ్యానికి విద్య

* విద్యావంతులు, పుణ్యాత్ములైన తల్లుల ఇళ్ళలోనే మహాపురుషులు జన్మిస్తారు. స్త్రీజన సముద్ధరణ, జన బాహుళ్యంలో జాగృతి ముందుగా రావాలి. ఆ తరువాతనే భారత దేశానికి నిజమైన మేలు చేకూరుతుంది.

* మిమ్మందరినీ కూడా అలాగే చేయమని, ప్రతి గ్రామంలోను, బాలికా పాఠశాలలు స్థాపించి, వారి ఉన్నతికై పాటుపడమని మరీ మరీ చెబుతున్నాను. స్త్రీలు ఉద్ధరించ బడితే వారి పిల్లలు కూడా ఉద్ధరించబడి, సచ్ఛీలురై దేశ ప్రతిష్ఠను నిలబెడతారు. అప్పుడు ఈ మాతృభూమిలో సంస్కృతి, జ్ఞానం, శక్తి, భక్తి జాగృత మౌతాయి.

* తమదైన రీతిలో, తమ సమస్యలను తామే పరిష్కరించుకునే స్థితిలో స్త్రీలను ఉంచాలి. వారి కోసం,

ఈ పనిని ఇతరులెవ్వరూ చేయకూడదు; చేయలేరు కూడా. ఇలా చేయడంలో మన భారతీయ మహిళలు, ప్రపంచంలోని ఇతర దేశీయ స్త్రీలలాగే సమాన శక్తి, సామర్థ్యాలను కలిగి ఉన్నారు.

⁕ మతం, కళలు, విజ్ఞాన శాస్త్రం, గృహ నిర్వహణ, వంటపని, కుట్టుపని, ఆరోగ్యం ఈ విషయాలలో సామాన్య మైన ప్రధాన విషయాలు మన స్త్రీలకు నేర్పాలి. నవలలు, నాటకాలు మొదలైన వాటిని (వారిని) తాక నివ్వడం అంత మంచిది కాదు. స్వార్థరహితమైన ఉత్తమాశయాలతో భక్తి ఏర్పడడానికి, ఆదర్శ వ్యక్తిత్వాలను ఎప్పుడూ బాలికల ముందుంచాలి. సీత, సావిత్రి, దమయంతి, లీలావతి మీరాబాయి వంటి ఉత్తమ మహిళామణుల ఉదాహరణలు వారి మనస్సులకు హత్తుకునేలా చెప్పాలి. ఆ ఆదర్శ మార్గంలో తమ జీవితాలను మలచుకునేటట్టుగా వారికి ప్రేరణ నివ్వాలి.





⁕ అటువంటి (సౌశీల్య నిర్మాణాన్ని పెంపొందించే) విద్య ద్వారా స్త్రీలు తమ సమస్యలను తామే పరిష్కరించు కుంటారు. ఇంతకాలం వాళ్ళు నిస్సహాయతలోను, సేవా భావంలో ఇతరుల మీద ఆధారపడడంలోనూ శిక్షణ ఇవ్వ బడ్డారు. అందుకే ఏ చిన్న కష్టం వచ్చినా, ఆపద కలిగినా, కన్నీళ్ళు పెట్టుకోవడమే వాళ్ళకు చేతనైంది. ఇతర విషయాలతో పాటు వాళ్ళు ధైర్యసాహసాలను, వీరత్వాన్నీ అలవరచు కోవాలి. నేటి కాలంలో ఆత్మ రక్షణ నేర్చుకోవడం వాళ్ళకు ఆవశ్యకమైపోయింది. ఝాన్సీ రాణి ఎటువంటి పరాక్రమవంతురాలో చూడండి!

⁕ విద్య, విజ్ఞానం జన సామాన్యంలో ఎంతగా వ్యాపి స్తాయో, ఆ జాతి కూడా అంతగా పురోగతి చెందుతుంది.

⁕ జనబాహుళ్యానికి విద్యను అందివ్వ గలిగితే, పరిస్థితి మెరుగుపడుతుంది. జ్ఞానం కంటే గొప్ప శక్తి ఏదైనా ఉందా? మీరు వారికి విద్యను ఇవ్వగలరా? ధనవంతులు ఎప్పుడైనా, ఎవరికైనా సహాయం చేసిన దేశం పేరు చెప్పు!

అన్ని దేశాలలోను మహత్కార్యాలను సాధించేది మధ్య తరగతి వారే.

* జ్ఞానం అనేది, సంస్కృతి గల కొంతమందికి మాత్రమే పరిమితమై ఉండకూడదు; అది పై తరగతుల వారి నుండి క్రింది తరగతుల వారికి వ్యాప్తం కావాలి. విద్య విస్తరిస్తున్నది. నిర్బంధ విద్యావిధానం కూడా ఇక వస్తుంది. మన ప్రజలకున్న అపార కార్యనిర్వహణ శక్తి తప్పకుండా వినియోగం కావాలి.

* మన క్రింది తరగతుల వారికి చేయవలసిన సేవ ఇదే. వారికి విద్యను అందించడం, వారు కోల్పోయిన వ్యక్తిత్వాన్ని పెంపొందించడం - వారికి ఈ భావాలను అందించాలి. వారు కళ్ళు తెరిచి, తమ చుట్టూ ప్రపంచంలో ఏం జరుగు తోందో చూసేలా చేయాలి. తర్వాత మిగిలింది వారే చేస్తారు.

* మన పేద ప్రజలు, ఈ భారత దేశం యొక్క పీడితులైన పామరులు, తమ నిజ స్వరూపాన్ని గురించి





విని, తెలుసుకోవలసి ఉంది. బలవంతులకు, బలహీనులకు అండయై, ఉత్తములకు, నీచులకు ఆధారమై, ప్రతి వాని లోను ఆ అనంతమైన ఆత్మ ఉంది. మనం ఉన్నతంగా, ఉత్తమంగా కావడానికి అవసరమైన అనంతమైన అవకాశం, అనంత సామర్థ్యం, అందరిలోను ఉందని ఇది చాటి చెబుతుంది. జాతి, జన్మ భేదాలు లేక, సబల దుర్బల విచారణ లేక ప్రతి స్త్రీ పురుషుడు, బాలుడు ఈ విషయాన్ని విని, నేర్చుకోవాలి. విశ్వమానవకోటి అంతకూ మనం ఇలా ప్రకటిద్దాం 'లే! మేలుకో!గమ్యం చేరే వరకు ఆగవద్దు!'





అసూయారాహిత్యమే సంఘటిత శక్తిలో ఉన్న రహస్యం.

## 20. స్ఫూర్తిదాయక వచనాలు

* లే! కార్యోన్ముఖుడవు కా! ఈ జీవితం ఎంతకాలం ఉంటుంది? ఈ లోకంలోకి వచ్చినందుకు చెప్పుకో తగిన కొంత ఘనతను సాధించు. లేదంటే, నీకూ, ఈ చెట్లూ, చేమలకు, రాయి రప్పలకూ తేడా ఏమిటి? అవి కూడా జన్మిస్తాయి, క్షీణిస్తాయి, అంతరిస్తాయి.

* మనం చాలా కాలం రోదించాం. ఇంక ఏడ్పులు ఆపి, మీ కాళ్ళపై మీరు నిలబడి, పురుషులు కండి! పురుషులను చేసే మతమే ఇప్పుడు మనకు కావలసింది. పురుషులను చేసే సిద్ధాంతాలే మనకు కావలసినవి. అన్ని విధాలా పురుషులను చేసే విద్యే మనకు కావలసింది.

* ఈ ప్రపంచం పిరికిపందల కోసం కాదు. పారి పోవడానికి ప్రయత్నించకు. జయాపజయాలను లక్ష్య

పెట్టకు. నిర్దుష్టమైన నిస్వార్థ సంకల్పంతో నిన్ను నీవు అనుసంధించుకుని, పని చేయి. విజయాన్ని సాధించడానికే జన్మించిన మనస్సు అచంచలమైన దృఢ సంకల్పంతో కూడి పట్టుదలతో సాధన చేస్తుందని తెలుసుకో.

* హృదయానికి, మెదడుకు సంఘర్షణ కలిగి నప్పుడు, హృదయాన్ని అనుసరించు.

* నువ్వు నిరుపేదవని అనుకోవద్దు; ధనం నిజమైన శక్తి కాదు. మంచితనం, పవిత్రతలే నిజమైన శక్తి.

* వీరులై ఉండండి! ధీరులై ఉండండి! మనిషి మరణించేది ఒక్కసారి మాత్రమే. నా శిష్యులు పిరికిపందలు కాకూడదు.

* సంఘటిత శక్తి మనలో పూర్తిగా లోపించింది. కాని, దీన్ని నిర్మించాల్సి ఉంది. అసూయారాహిత్యమే దానిలో ఉన్న పరమ రహస్యం. నీ సోదరుల అభిప్రాయా లకు సర్వదా తల ఒగ్గటానికి సిద్ధంగా ఉండి, వారితో





అన్యోన్యతను సాధించడానికి ఎల్లప్పుడూ ప్రయత్నించు. రహస్యమంతా అదే.

* నేను ప్రబోధించే వాటన్నిటిలో ముందుగా దీన్ని ప్రధానమైనదిగా వక్కాణించి చెబుతాను. ఆధాత్మిక, మానసిక, శారీరక దౌర్బల్యం కలిగించే దేనినీ కూడా నీ కాలి బొటన వ్రేలితోనైనా కూడా తాకవద్దు. మానవుని అంతరంగంలో సహజంగానే ఉన్న శక్తిని అభివ్యక్తం చేయడమే మతం.

* ప్రపంచానికి కావలసింది సౌశీల్యం. ఎవరి జీవితం ఉజ్జ్వల ప్రేమయుతమై, నిస్వార్థమై ఉంటుందో అలాంటి వారే లోకానికి ఆవశ్యకమై ఉన్నారు. పిడుగు పాటుకు ఉన్నంత శక్తిలో ఆ ప్రేమ, ప్రతి మాటను మనచే చెప్పేలా చేస్తుంది.

* ధీర వాక్కులు, ధీరతమమైన చేతలు మనకు కావలసి ఉన్నాయి. ఓ మహనీయులారా! లేవండి, మేల్కోండి! ఈ ప్రపంచం దుఃఖంతో రగులుతోంది. మీరు

నిద్రపోగలరా? నిద్రిస్తున్న దేవతలు మేల్కొనే వరకు, అంతరంగంలో ఉన్న దైవం మన పిలుపుకు స్పందించే వరకు, మనం ఎలుగెత్తి పిలుద్దాం! జీవితంలో ఇంతకంటే ఎక్కువేముంది?

* వికాసం చెందడానికి ప్రయత్నించు; చైతన్యం, అభివృద్ధి మాత్రమే జీవనానికి చిహ్నాలని గుర్తుంచుకో.

* గాంభీర్యం లేకుండా, ప్రతి దాన్నీ వేళాకోళం చేసే బుద్ధి ఈ జాతి రక్తంలోనికి చొచ్చుకొని పోయింది. ఈ ఘోర వ్యాధిని తొలగించుకోండి. దీన్ని వదిలిపెట్టండి. దృఢంగా ఉండి, శ్రద్ధను కలిగి ఉండండి; మిగిలినదంతా వచ్చి తీరవలసిందే.

* లే! మేలుకో! లక్ష్యం చేరే వరకు ఆగకు! భయ పడకు. మానవజాతి చరిత్రలో మహోన్నత శక్తి అంతా ప్రజల నుండే ప్రభవిస్తూ వచ్చింది. అలాంటి ప్రజా శ్రేణుల నుండే ప్రపంచంలోని మహా మనీషులంతా ఉద్భవించారు.







లక్ష్యంపై ఉన్నంత శ్రద్ధాసక్తుల్ని, లక్ష్య సాధనలో సైతం చూపించాలి. విజయ రహస్యమంతా ఇదే.



సత్యాన్ని త్రికరణశుద్ధిగా నమ్మితే విజయం తథ్యం.
నెమ్మదిగానైనా సరే, మనం జయించి తీరుతాం.